# గోలకొండపత్రిక

స్వభాను సం॥ర పుష్య శు॥౧౧ గురువారము

# మతాభిమానులకు సదుపదేశము

మ. ఘ. వ. నిజాంగారి రాష్ట్రము లోని దోర్నకల్లులో క్రైస్తవ్యమత సేవ చేయుచు బిషప్ అను అధికారిగా ఉన్న రైట్ రెవరెండు వి. యస్. అజరయ్యగారు బ్రిటిషు ఆంధ్రదేశమందు ఏలూరులో మొన్న డిసంబరు ౩౦ వ తేదిన ప్రారంభమైన ఆంధ్రరాష్ట్ర క్రైస్తవ మహాసభయందు ఉపన్యసించుచు క్రైస్తవులను ఉద్దేశించి చేసిన ఉపదేశము ఈనాడు భారతదేశమందు క్రైస్తవులొక్కరే గాక తక్కిన మతములలోని వారలుకూడ వినవలసిన అవసరమున్నది. ఇక్కడ మతములను పదమును ఇంగ్లీషులోని "రిలిజియన్" అనుపదము యొక్క అర్థములో భగవంతుడు, దేవతలు మొదలైన గొప్పశక్తులనుపూజించుట అను నిట్టి విషయముల గురించి వేర్వేరు జనులకు ఉండే విశ్వాసభేదములను సూచించుటకై వాడుచున్నాము. భారతదేశములో ఇట్టి విశ్వాసభేదములు అనేకములున్నవి. ఈ భేదములను చూచుకొనుచు ప్రతివారును తమ తమ మతములలోని వారలకు రాజ్యాధికారము తప్పక ఉండవలెనని పట్టుపట్టినట్లయితే భారతదేశముయొక్కగతి ఈ వివాదములమధ్య పిల్లులతగవును కోతి తీర్చిన విధముగ ఆస్తిలో భాగములు ఆస్తిగలవారలకు ఏమీలేకుండ మూడవవానికి లభించినట్లు కాగలదు ఇదిశుభ్రముగా కనపడుచున్న సంగతే. అయినను మనదేశమందు జనులమనస్సులపై మతవిశ్వాసముల ప్రభావము అసంగతిని కనబడకుండ చేసేపొరను ఆవరింపజేసి పెట్టినది. అందువల్ల దోర్నకల్ బిషప్‌గారి ఉపదేశములవంటివి అన్ని మతములలోను ఎక్కువగా ప్రచారము కావలసిన అవసరము ఉన్నదని అంటిమి.

క్రైస్తవులు మతపాక్షికములైన లాభములకొఱకై కుయుక్తులలో దిగి ఒకసారి ఒక పార్టీతో, ఇంకొకసారి ఇంకొక పార్టీతో చేరుచుండుటవల్ల క్రైస్తవమతమునకే అన్యాయముచేసిన వారగుదురని అజరయ్యగారు హెచ్చరిక చేసిరి. వారిమాటల ఫలితార్థము మతవిశ్వాసాలను రాజకీయములతో కలగంపులగంచేసి గందరగోళము చేయవద్దని నట్లున్నది. "యుద్ధానంతరము భారతదేశపు రాజ్యాంగము తప్పకుండా భారతీయులకొఱకై భారతీయులు పరిపాలనచేయువ్యవస్థగానుండకతప్పదు" అనుచు, వారు 'భారతీయ పరిపాలకులవల్ల క్రైస్తవమతమునకు హానికలుగునని భయపడేవారలలో తాను ఒకడను కాను' అనిరి. దేశచరిత్రలను గమనించినవారలకు జాతీయభావములను నిరంతరము అదిమివేయగల్గుట అసాధ్యమని తెలియగలదు. అట్లయినపుడు జాతీయ భావములను విరోధముతో అడ్డగించిపోరాడుట అవసరమని మొదటనే గ్రహించి ప్రతిమతమువారు జాతీయతతో విరోధములేకుండ తమ మతములను రక్షించుకొనుటకు యత్నించుట మంచిదికాదా? మతపుసాకులనుచెప్పుచు రాజకీయములలో జాతీయతకు అపరాధము చేయవద్దనియే అజరయ్యగారి హెచ్చరిక. దేశములో శాంతిసౌఖ్యములు ఉండవలెననిన ప్రతిమతములోని వారలును ఈ మంచిమాటకు బద్ధులు కావలసినదే.

---

## పాకిస్థాన్ ఎన్నటికిని సిద్ధించదు

### డాక్టర్ ఖాన్‌సాహెబ్ గారి అభిప్రాయము

లాహోరు, డిసంబరు ౨౮

యుద్ధప్రారంభమున వాయువ్యసరిహద్దురాష్ట్రమందు కాంగ్రెసుమంత్రివర్గమునకు ప్రధానిగనుండిన డాక్టర్ ఖాన్‌సాహెబ్ గారు పెషావరునుండి ఇక్కడికివచ్చి 'యునైటెడ్ ప్రెస్' ప్రతినిధిఅడిగిన ప్రశ్నలకు సమాధానములిచ్చిరి. వారు ఈ క్రింది అభిప్రాయములను వెల్లడించిరి:—

పాకిస్థాన్ అనునది కొందరిడాంబాలలో కల్పనగామాత్రమేఉన్నది. అది ఎప్పటికిని అట్లేఉండగలదు. దేశస్వాతంత్ర్యము సిద్ధించుటకు దేశైకమత్యము తప్పక ఉండవలసిన అవసరములేదు. స్వాతంత్ర్యముసిద్ధించినవెంటనే ఐకమత్యము ఏర్పడగలదు. భిన్నమతస్థులగు దేశీయులకు ఐకమత్యములేదు కనుక దేశస్వాతంత్ర్యములేదని బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞులవిషయమున మాత్రము చెప్పియుంటిరేనా? బ్రిటిషుసామ్రాజ్యవ్యవస్థ అసలేలేకుండ పోవుటకు తానిష్టపడనని చర్చిల్ గారు శుభ్రముగాచెప్పియున్నారు, దేశములో ఇప్పటి ప్రతిష్టంభనమును బ్రిటిషుసామ్రాజ్యవ్యవస్థకై కావలెనని కల్పించినారు. ఆసామ్రాజ్యవ్యవస్థపోయి, ఇండియాకు స్వపరిపాలనాధికారమిచ్చినగాని ఆ ప్రతిష్టంభనములొంగదు. ఇట్లని దేశీయులు నిరుత్సాహపడరాదు. ఈ యుద్ధముముగియులోగా భారతదేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించగలదు.

సరిహద్దురాష్ట్రమువల మాకు సమూలపరివర్తనము కావలెననుభావనఏర్పడినది ఈ రాష్ట్రమందలి జమలనందరిని నాశనముచేసినగాని ఈ భావనను ఎంతటిశక్తియైనను పోగొట్టజాలదు. పరానుస్వాతి ప్రిన్సిపములుగా ప్రజాప్రభుత్వాభిలాషి, సంఘసామ్యాభిలాషి, పరసామ్రాజ్యవాద్యద్వేషి.

---

## కాంగ్రెసు సొత్తు జప్తు

కాన్పూరు, డిసంబరు ౩౦

౧౯౪౨ ఆగస్టునాటి తేదిన పోలీసులు సదర్ బజారులోని కాంగ్రెసు సమితి కార్యాలయమునుండి పట్టుకొనిపోయిన చరాస్తిని ప్రభుత్వవశము చేయదలచినట్లు జిల్లా మేజిస్ట్రేటు ఒక ప్రకటనచేసినారు.

---

## గొప్ప అగ్నిప్రమాదము

బొంబాయి నగరమందు డిసంబరు ౩౦వ తేది పగలు ౩౹ గంటలకేళ హారన్బీరోడ్డునందు బొంబే గాస్ కంపెనీకి సమీపమందున్న 'తాజ్‌బిల్డింగు'లో గొప్ప అగ్నిప్రమాదము జరిగెను. అది ఆభవనముయొక్క క్రిందిభాగమున ప్రారంభమై మొదటి, రెండవ, మూడవ అంతస్తులకు వ్యాపించినట్లున్నది. ఆమూడు అంతస్తులలోనుండు కొన్ని వాణిజ్యసంస్థల కార్యాలయములును, కొన్ని ప్రభుత్వశాఖల కార్యాలయములును సర్వనాశనమైనవి. అన్నిటికంటె క్రిందిభాగమునందలి గొప్ప పుస్తకవిక్రయసంస్థకు చాలకొద్దినష్టముమాత్రమే కలిగెను. ౧౩ ఫైర్ ఇంజనులు వచ్చి మంటలను చల్లార్చెను. చల్లార్చులోగా కొందరు మొదటి అంతస్తునుండి క్రిందికిదూకిరి. కొందరి శరీరములు కాలినవి. ఒక లక్షరూపాయీల నష్టము కలిగినట్లు చెప్పుచున్నారు.

---

### బెంగాలునకు

## చైనా స్త్రీల ధనసాహాయ్యము

చంగ్‌కింగ్, డిసంబరు ౨౮

'న్యూలైఫ్‌మూవ్‌మెంట్' అనుదాని యొక్క స్త్రీల సలహాసంఘమునకు సంబంధించిన మెప్పిపట్టణపుశాఖవారు ఇండియాలో క్షామబాధితులరక్షణ కొరకై ౫౦౦౦౦ డాలరులను వసూలుచేసినారు ఇండియాకు పంపించవలసినదని చియాంగ్‌కైషేక్ సతిగారికి ౫౦౦౦౦ డాలరులు ఇవ్వబడినవి.

---

## హిందూమహాసభాధ్యక్షుని ఊరేగింపుపై లాఠీప్రయోగము

### హిందూ మహాసభవారు ఆగ్రహము ప్రకటించుట

అమృతసరులో అఖిలభారత హిందూమహాసభ ౨౫ రు డిసంబరు ౨౬వ తేదిని భారతదేశమునకు వెంటనే స్వాతంత్ర్యము నొసగవలెనను తీర్మానమును ఆమోదించినతర్వాత, డిటెన్యూలకును, రాజకీయఖైదీలకును వ్రాసెడిజాబులలో హిందీభాషను వాడరాదనుఆజ్ఞను పంజాబు రాష్ట్రపు మంత్రివర్గమువారు చేసియున్నారనియు. ఆయాజ్ఞనురద్దుచేయవలెననియు ఒక తీర్మానమును చేసిరి.

పిమ్మట బెంగాలు రాష్ట్రములోకరవును గురించి ఈ క్రిందివిధముగా తీర్మానము ఆమోదించబడినది.

"లక్షలకొలది జనుల మరణములకును, దారిద్ర్యము, తిండిచాలకుండుట అనునవి ఎక్కువగా వ్యాపించుటకును కారణమైన బెంగాలు కరువు మనుష్యకృతమైనదేనని ఈ సభవారి అభిప్రాయము. తిండికరువు, జనులబాధలు ఎక్కువయగుటకు అప్పటిగవర్నరుగారి కుతంత్రముచే అధికారము సంపాదించుకొనిన ముస్లింలీగు మంత్రివర్గముయొక్క చేతగానితనము తోడ్పడినది. ధరలమితిమీరి హెచ్చుటయు, దొంగతనముగా సరకులను ఎక్కువధరలకు అమ్మటయు అనువాటికి లీగు మంత్రివర్గము క్షామబాధితమైన బెంగాలు రాష్ట్రమందు లబ్ధియ్యమునుకొనుటను తమపార్టీనిబలపరచువారలను ప్రభుత్వపుఏజంట్లనుగా నియోగించుటచే ప్రోత్సాహము కలిగినది. అట్టిఏజంటులకు ౫ కోట్లరూపాయీలకు పైగా అడ్వాన్సులిచ్చినారు

"ఈ మహాసభవారు క్షామ బాధితులకును వారల కుటుంబములకును మనసార సానుభూతిని తెలుపుకొనుచు ఈ క్షామకారణములను గురించి విచారణజేసి ఈ క్షామమునకు కారణమైనవారలకు శిక్షవిధించవలెనో నివేదించుటకై ఒక నిష్పక్షపాతమైన విచారణసంఘమును బ్రిటిషు ప్రభుత్వమువారు నియోగించవలెను.

"ఆరాష్ట్రములో సాంఘికపరిస్థితిని ఆర్థికపరిస్థితిని బాగుచేయుటకై అన్ని పార్టీల నాయకులు సభ్యులుగల 'ఒకసమితిని ఉపాయములను సూచించవలసినదిగ ప్రభుత్వము వారు కోరవలెనని ఈ మహాసభవారుసూచించుచున్నారు"

డిసంబరు ౨౭వ తేదిన మహాసభాధ్యక్షులైన డాక్టర్ శ్యామప్రసాద్ ముఖర్జీగారికి ఊరేగింపు హిందూమహాసభ యొక్క రజతోత్సవ సందర్భమున జరిగినది. ఆఊరేగింపుజనము గవర్నరుగారి మైనను ముందుకుపోయెనో లేదో, ఆజనమును లాఠీప్రయోగముచేసి పోలీసులు చెదరగొట్టిరి.

ఇట్టికార్యములు జరిగినందుకై మహాసభయొక్క విషయనిర్ధారక సభలో సత్యాగ్రహము జేయవలెనని కొందరు ఆగ్రహముచూపినట్లును, కాని ఎక్కువమందిసభ్యులు దానికి అనుకూలించు నట్లును, 'ఫ్రీప్రెస్‌జనరల్' పత్రికయొక్క విలేఖకునికి తెలిపినట్లు ఆపత్రికలో ప్రకటించబడినది.

డిసంబరు ౨౯వ తేదినఈ దేహిందూ మహాసభ సందిడిరిలోనే విక్రమార్కశకపు ప్రథమ సహస్రవర్షసమాప్తి సందర్భమునజరిగిన బహిరంగ సభలో పంజాబు ప్రభుత్వమందు హిందూ మంత్రియగు ఆర్థికమంత్రి సర్ మనోహర్ లాల్ గారు ఉపన్యాసమునకుపన్యసించుచుతాను అమృతసర్‌కు రాకముందేపైన చెప్పినలాఠీ ప్రయోగము విషయమై పంజాబులో అందరికంటె గొప్పఅధికారులను విచారించినట్లును, అమృతసరుకు రాగానే గాయపడినవారలలో కొందరినిచూచి ఇట్లను తెల్పిగాయపడినవారలను గురించి సానుభూతిని తెలిపిరి. కానిఇట్టి సంఘటనలను తప్పించుట కష్టమనిరి.

అట్టి ఈ సంఘటనను గురించి మహాసభవారుఒక తీర్మానము నామోదించినారు. లాఠీప్రయోగచర్యను వారు తీక్షణముగా నిరసించి, బాధ్యతలేకుండ ఇట్టిచర్యను నడిపించినస్థానిక అధికారులకు తగినశిక్షను విధించవలెననినారు.

అఖిలభారత హిందూమహాసభయొక్క కార్యనిర్వాహకసమితివారు డిసంబరు ౨౮వ తేదినహిందూ మహాసభాధ్యక్షులవారి ఊరేగింపుజనముపై జరిగిన లాఠీప్రయోగమును గురించి విచారణ జేయుటకై పూర్వము లాహోరు హైకోర్టుజడ్జిగాఉండిన సర్ తేక్‌చంద్ గారిఅధ్యక్షతన రాయిబహదర్ బదరీదాసు, రామెసాహెబ్ గంగారాంసోని గారలు సభ్యులుగగల ఒక ఉపసంఘమును డిసంబరు ౩౧వ తేదిన ఏర్పాటుజేసినారు.

డిసంబరు ౨౯వ తేది ఉదయం మహాసభ కార్యనిర్వాహకవర్గమువారు వి.డి. సావర్కరుగారిని అధ్యక్షునిగను, డాక్టర్ శ్యామప్రసాద్ ముఖర్జీ గారిని తాత్కాలికాధ్యక్షునిగను, డాక్టర్ బి.యస్. మూంజే, బి. ఎల్. భోపట్కర్. యన్. సి. చటర్జీ, భాయిపరమానంద్, వరదరాజులు నాయుడు, పీరంజేగ రాజ్ గారలను ఉపాధ్యక్షులనుగను, కపర్డీ, సంతోష లాహిరి, కెకెచ్ చంద్ర గారలను ప్రధానకార్యదర్శులనుగను ఎన్నుకొనిరి.

మహాసభయొక్క రాబోవుసమావేశము బిలాస్పూరులో జరుగునట్లు నిర్ణయించిరి.

---

## భారతీయ క్రైస్తవులకు దోర్నకల్లు బిషపుసలహా

### ప్రభుత్వాధికారాలకై కుతంత్రాలలో దిగవద్దు

ఆంధ్రదేశమందలి ఏలూరులో డిసంబరు ౨౯వ తేదిన ప్రారంభమైన ఆంధ్రరాష్ట్ర క్రైస్తవమహాసభయందు దోర్నకల్లుబిషపు వి యస్. అజరయ్యగారు ఉపన్యసించుచు భారతీయ క్రైస్తవులకు కొన్నిసదుపదేశములనుచేసిరి.

క్రైస్తవులు ఇండియాలోని ఒకరాజకీయపక్షముతో ఒకసారి, ఇంకొకదానితో ఇంకొకసారి ఈ విధముగా రాజకీయాధికారకాంక్షతో చేరుచుండుటవల్ల ఆఖరకు స్వధర్మము నువదలుకొనవలసిన వారగుదురు. కాబట్టి క్రైస్తవులు ఏ రాజకీయపక్షముతోగాని చేరక స్వతంత్రముగ ఉన్నందువల్ల వారలకు రాజకీయాధికారము రాదు కాని, స్వధర్మమును రక్షించుకొనగలుగుదురని అజరయ్యగారు చెప్పిరి. యుద్ధానంతరము భారతదేశమందు భారతీయులేపరిపాలన సాగించగలరనియు, అట్టిభారతీయులపరిపాలనలో క్రైస్తవమతమునకుచిక్కులు కలుగునని భయపడెడివారలలో తానుచేరననియు వారుచెప్పిరి.

మదరాసు రాష్ట్రమందుసంపూర్ణమద్యపాననిషేధము అమలుచేయబడినప్రదేశములయందు తాను సంచారముచేసి చూచితిననియు, మద్యనిషేధప్రయత్నము వ్యర్థముకాలేదని తాచుచెప్పగలననియు అందువల్ల మద్యనిషేధశాసనమును ఇప్పుడు అమలునుండితొలగించుట తేదపడదగినదేయనియు, ఈ విషయములో భారతీయక్రైస్తవులు ముసల్మానులతోను హిందువులతోను సమానాభిప్రాయులేయనియు కల్లుసారాయి మొదలైన మద్యములు సేవించుటపాపమని ప్రజలందరును గట్టిగాభావించునట్లుచేయుటకు క్రైస్తవులుఉద్యమించవలెననియు అజరయ్యగారుచెప్పిరి. మదరాసురాష్ట్రమందు నాలుగుజిల్లాలలోమాత్రమేకాక ఆరాష్ట్రమంతటను మద్యముచునిషేధించవలెనని.

మహాసభకు అధ్యక్షతవహించిన జె. రాజారావుగారు తమఉపన్యాసమందు భారతీయక్రైస్తవులు స్వదేశభక్తియందు తక్కిన ఏజులకువారికంటెయుతీసిపోరని చెప్పిరి. క్రైస్తవులుస్వకులోద్ధరణకై పాటుపడవలెనే కాని ఇతరకులములవారలతో కలహములను పెట్టుకొనుచుండరాదని వారుఉపదేశించిరి".

---

### సైకిళ్ల రేషన్ ఆజ్ఞ

సైకిలురేషన్ ఆజ్ఞ నొకదానిని ఇండియాప్రభుత్వమువారు గజెటులో ప్రకటించినారు.

పనికిరాని సైకిలునుగాని ట్యూబునుగాని ప్రభుత్వమువారు ఒప్పుకొన్నట్టివారుతప్ప మరెవరుగాని పదిరోజులకుమించి దగ్గరఉంచుకొనరాదు. దానిని తమకు చాలదగ్గరలోనుండు ప్రభుత్వపురక్షణ డిపోకుసామాను బండిలో పంపించవలెను. ప్రభుత్వమువారు దానిధరనిచ్చుకొందురు. అంతేగాని అట్టిపనికిరాని సైకిలులను, ట్యూబులను మరేవిధమునగాని చెడగొట్టరాదు

---

### సిగరెట్ల ధరల కంట్రోలు

ఇండియాప్రభుత్వము నానారకములసిగరెట్లకు ధరలనుర్ణయించి ప్రకటించినారు. ఆధరలకంటె ఎక్కువకు అమ్మరాదనినారు.

---

## నిజామురాష్ట్రాంధ్ర సారస్వత పరిషత్తు

(హైద్రాబాదు దక్కన్.)

మన పరిషత్తుపక్షమున ౧౯౪౪ మార్చి ౩౧వ తేదిలలో 'ప్రవేశపరీక్ష' జరుగునట్లు ఏర్పాటుచేయబడుచున్నదని రాష్ట్రీయులగు ఆంధ్రులకు తెలియనిది కాదు. అభ్యర్థిపత్రములను విద్యార్థులచే సక్రమముగా పూర్తిచేసి, మార్చి ౩౧ లోపుగ ప్రధానకార్యస్థానమునకు పంపవలసియున్నది. ఇంతవరకుకార్యనిర్వాహకవర్గమువారి తీర్మానముప్రకారము, వరంగల్లు, ఖమ్మంమెట్టు, హైద్రాబాదు, నల్లగొండ, మహబూబునగరము, కరీంనగరము, మెదకు, నిజామాబాదు, నిర్మల, గద్వాల్, కొల్లాపురము, పాల్వంచ, వనపర్తి, మంథని, సూర్యాపేట, అను ౧౭ స్థలములలో పరీక్షాకేంద్రములు ఏర్పాటుచేయబడినవి పైగా ఉగయు విద్యార్థి లెచ్చటకావలయునని కోరదరో, అచ్చట క్రొత్తకేంద్రములను స్థాపించుఉద్దేశమును గూడ తెలిపియుంటిమి. అన్నికేంద్రములలోను పర్యవేక్షకులనేర్పాటు చేయవలసియున్నది. కావున విద్యార్థులు అభ్యర్థిపత్రములతోకూడ ౩ పోస్టువిళ్ళనుపంపుచు, తామేకేంద్రమున కూర్చుందురదియు, లేదాక మరు క్రొత్తకేంద్రము కావలసినవిషయములు, తెల్పినయెడల, కార్యసౌలభ్యము ఏర్పడగలదు. అందుచే ఈ విషయమై ముందుగా విద్యార్థులకు హెచ్చరించుచున్నాము.

విధేయుడు,

బిదురు వెంకట శేషయ్య,

సం కార్యదర్శి.

౪-౧-౪౪

*

ఈ పరిషత్తువారలోగడచేసిన ౫౦౦౦ రూ విజ్ఞప్తిని ఆదరించుచుపరిషత్తుకు మహారాజపోషకులగు శ్రీ శ్రీ శ్రీ రాజారావుదేవరావు బహద్దరు (వనపర్తిసంస్థానాధీశులు) వారు ౫౦౦ రూ విరాళమిచ్చినారు, వారిసారస్వతాభిమానము మిక్కిలిస్తుతిపాత్రము. శ్రీ వారిచ్చిన యీదానము విషయమే లోగడ గోలకొండపత్రికలో ఒక భూరిదానము అను పేరుప్రకటింపబడినది.

---

### ని. రా. ఆం. మహాసభ గ్రామ కమిటీ కార్యసమితి ఎన్నిక

(ఓ. వి.)

౨౪-౩-౫౩ఫ. శుక్రవారంసాయంత్రము ౫గంటలకు ఖమ్మం తాలూకాలో చొప్పకట్లపాలెం గ్రామ ఆంధ్రమహాసభ ప్రాథమిక సభ్యులు వీరనాతల శ్రీరాంరావుగారి తాత్కాలిక అధ్యక్షతన సమావేశమై యీ దిగువ కార్యనిర్వాహకవర్గమును ఎన్నుకొనిరి.

అధ్యక్షులు— ఏకునూతల వెంకటపాపారావుగారు,

కార్యదర్శి— బొప్పాల సీతారామయ్యగారు.

సభ్యులు కన్నూరు చిన్నసీతయ్య, కన్నూరులక్ష్మీనారాయణ, మందపుడి నర్సయ్యగార్లు.

---

# ఇండియాకు వెంటనే స్వాతంత్ర్యమియ్యవలెను

## దేశమును చీలికలు చేయరాదు

కేంద్రమునకు బలమెక్కువైన ఫెడరేషను కావలెను.

అఖిలభారత హిందూ మహాసభ వారి తీర్మానము

అమృతసర్, డిసంబరు ౩౧

అఖిలభారత హిందూమహాసభయొక్క సమావేశము నేటిరాత్రితో సమాప్తమైనది. సభవారు రాజకీయములనుగురించి ఈక్రిందితీర్మానము చేసినారు.

దేశములో రాజకీయ స్థితి విచారకరముగ నున్నది వ్యర్థప్రయత్నము లాయొనేయును విచారము నాటుకొనుచుండుటవల్ల జాతీయసంకల్పము దుర్బలమగుచున్నది. అందువల్ల ఇండియాకు వెంటనే స్వాతంత్ర్యమియ్యవలెను అనియు, వెంటనే జాతీయ ప్రభుత్వము నేర్పాటుచేయవలెను అనియు అడిగినను బ్రిటిషుప్రభుత్వము అట్లుచేయకుండుట వారి వైఖరి ఈమహాసభవారికి చాలా ఆగ్రహం కలిగించినది.

"కలకత్తాలో ఇండియా వైస్రాయి లార్డు వేవెల్ గారుచేసిన ఉపన్యాసము చాలా నిరాశా జనకమైనది. భారతదేశమును శత్రువునుండి బాగుగారక్షించవలెనన్నను, ఈదేశములో ఆర్థిక స్థితిని బాగుచేయవలెననినను ఆ పిదిగారిని ఇండియా మంత్రిపదవినుండి తొలగించుట అవసరము. దేశములో రాజకీయ పరిష్టంభనమును తొలగించవలెను. రాజకీయఖైదీలను, డిటెనూలనువదలవలెను. దేశములో జాతీయాభిప్రాయాలు కలవారలనందరిని ఒకటిగకలిపి, దేశమును శత్రువునుండి రక్షించుటకై దేశసంపదనంతయు కూడదీయుటకు రాయబారాలను నడుపవలెను. ఇది ఈసభవారి అభిప్రాయము.

ఇండియా అఖండముగ నుంచబడవలెనను సిద్ధాంతమునకు ఈసభవారు బద్ధులమని మరల స్పష్టిగాచెప్పుచున్నాము, రాబోవు రాజ్యాంగము బలమైనకేంద్రముగల ఫెడరేషనుగా నుండవలెను, రాష్ట్రములుగాని, ఏతెగజనులుగాని, అట్టి ఫెడరేషనునుండి చీలిపోవుటకు అధికారమీయరాదు. కేంద్రమునను, రాష్ట్రములలోను ప్రజాప్రతినిధుల సభలకు సభ్యులనుసంయుక్త నియోగపద్ధతిప్రకారము ఎన్నుకొనవలెను. ఒక్కొక్కనికిఒక్కొక్క వోటుమాత్రమే ఇచ్చు హక్కు ఉండగలదు.

"అల్పసంఖ్యాకుల మతమునకు, విజ్ఞానమునకు వారినంత రక్షణచేయబడునని ఇదివరలో ఇచ్చియున్న వాగ్దానములను మరల ధ్రువపరుచుచున్నాము."

ఈతీర్మానములో కోరబడినట్టి కోరికలు హిందూమహాసభవే గాక కాంగ్రెసువికూడ అయియున్నవని అధ్యక్షుడగు శ్యామప్రసాద ముఖర్జీ గారు తమకడపటిఉపన్యాసంలో చెప్పిరి. జిన్నా గారు తమపాకిస్తాను విధానమును వదలి వివేకము తెచ్చుకొనగలరోజు రాగలదని తనకు ఆశయున్నదని ముఖర్జీ గారనిరి. మరియువారు గాంధి మహాత్ముని అహింసాపద్ధతి తనకు సమ్మతము కాదనిరి. తమశత్రువులకు బెదురుపెట్టుటకు హింస తగునని వారు చెప్పిరి.

సభాప్రారంభమున కాంగ్రెసువారలు చేసిన త్యాగములను మెచ్చుకొనుగీతములు పాడబడగా వేదికపైనుండిన కొందరు కోపపడిరి. అందుపై కాంగ్రెసును అభిమానించు కొందరు గోలపెట్టిరి. తర్వాత అధ్యక్షుడగు ముఖర్జీగారువచ్చి గాంధిమహాత్మునిగురించి ఆ వ్యాయము గా ఏమైన చేయుమాట అనబడియు డినలో దానికితాము పశ్చాత్తాపపడుచుంటిమనిరి. కాంగ్రెసు మహాపురుషులకు తామేగాక దేశమంతయు భక్తితో స్మరించగలదనిరి.

మహాసభవారు ఆమోదించిన మరొక తీర్మానములో ముసల్మానులు ఎక్కువ జనసంఖ్యగల రాష్ట్రములలో హిందువులు అనేకసారులు తమకు అన్యాయమైన బాధలు కలిగించబడుచున్నవని మొఱపెట్టుకొనియున్నారు. కాబట్టి మహాసభాధ్యక్షులవారు ఈకష్టములనుగురించి విచారణచేసి సాధ్యమైనంతత్వరలో తెలిసినసంగతులను నివేదించుటకై ఆయుగురుసభ్యులుగల ఒక ఉపసంఘము నేర్పాటుచేయవలెనని కోరబడినది.

ఈతీర్మానముతర్వాత మొదటనే తెలిపిన రాజకీయతీర్మానము ఆమోదించబడెను. రాజకీయతీర్మానమును ప్రతిపాదించిన రాయబహద్దర్ మెహర్ చందు జిన్నా గారుఉపన్యసించుచు "గాంధి, నెహ్రూ, ఆజాదుగారలు కిరీటములులేని ప్రభువులుచాలా ఉన్న ఇండియాకు స్వాతంత్ర్యము తప్పక దొరకగలదనితమకువిశ్వాసమున్నట్లు చెప్పిరి.

## ఇండియాకు మోటారు కారుల నిర్మాణశాల

బిర్లా బ్రదర్సువారు మోటారుకారు భాగము లను కలిపి మోటారులనుచేయుట కుపయోగించు యంత్రమును, యితరయంత్రములను సంపాదించియున్నారు వారలు అనుకూలపరిస్థితులు లభించినవెంటనే ఒకయంత్రశాలను పెట్టనున్నారు. "హిందూస్థాను మోటార్స్ లిమిటెడ్" కంపెనీయొక్క మూలధనమును వృద్ధిచేయుటకై అనుమతించవలసినదని విజ్ఞప్తిని అప్పుడే ప్రభుత్వమువారికి పంపించినారు. ఇంగ్లాండు,అమెరికాసంయుక్త రాజ్యములనుండి ఈమోటారుపరిశ్రమయందు ప్రవీణులైనవారలు పనిజరిపించుటకై, రప్పించబడినారు, మధ్యరకపు మోటారుకారులను. తేలిక ట్రక్కులను తయారు చేయవలెనని సంకల్పమైయున్నది.

## మౌలానా ఆజాదుగారికి సోదరీ వియోగము

జెయిలులోనున్న కాంగ్రెసు అధ్యక్షుడగు మౌలానా అబుల్ కలాం ఆజాదుగారిసోదరియగు అబ్రుబేగం గారు దీర్ఘకాలముజబ్బుపడి, డిసంబరు ౩౧వ తేదిన భోపాలులో మరణించినారు. ఆమె శవమును తీసికొనిపోవునపుడు ఘనతవహించిన భోపాలు బేగంగారును, ఆసంస్థానపు ప్రసిద్ధపురుషులును వెంటనడచిరి. అబ్రుబేగం గారు ౩౦ఏండ్ల క్రింద భోపాలులో నివాసమేర్పరచుకొనిఅక్కడి స్త్రీల అభ్యుదయమునకై సేవలు చేసెను. ఎన్నియోమారులామె అఖిలభారత మహిళామహాసభలకు భోపాలుసంస్థాన స్త్రీప్రతినిధిగ వెళ్ళియుండెను.

## విద్యుచ్ఛక్తి నుపయోగించినందుకుశిక్ష

వ్యాపారస్థలు విద్యుచ్ఛక్తిని ఉపయోగించకొనరాదని పంజాబు ప్రభుత్వమువారు ఆజ్ఞచేసియున్నను, దానికివ్యతిరేకముగా లాహోరులోని 'విక్టర్ సాల్టు రిఫైనర్ వర్క్సు' అను లవణసంస్కరణ పరిశ్రమసంస్థయొక్క మేనేజరు, ప్రొప్రైటరులు విద్యుచ్ఛక్తిని ఉపయోగించుకొనిరని — లాహోరు మేజిస్ట్రేటుగారి వీరువురికిని వరుసగా రూ ౧౫౦లు, రూ ౫౦లు జుర్మానాను విధించిరి. జుర్మానాను చెల్లించనిచో వరుసగా ఒకనెల మూడునెలల ఖైదుశిక్షల ననుభవించవలెనని ఆజ్ఞ చేసిరి. ఈశిక్షలు భారతదేశరక్షణ నియమాలలో నిర్దేశించబడినట్టివి.

## మందులను మితిమీరిన ధరకమ్మినందుకుశిక్ష

కాశీలో దశాశ్వమేధములో ఒక కెమిస్టుయొక్క దుకాణమందు ప్రభుత్వము నిర్ణయించినంతకంటె ఎక్కువధరలకు మందులను అమ్మినారని, అక్కడిమందులన్నిటిని ఆపట్టణపు "రేషనింగ్ ఆఫీసరు" డిసంబరు ౨౮వ తేదినపట్టుకొనిపోయెను.

### లైసెన్సులేని బట్టల దుకాణపు వర్తకుని గతి

అహమ్మదాబాదు నగరమందు లైసెన్సులేకుండ బట్టలదుకాణమును పెట్టివ్యాపారముచేసెనని ఒకవర్తకుని భారతదేశరక్షణనియమాల ననుసరించి డిసంబరు ౨౮వ తేదిన అరెస్టుచేసినారు.

...

ఢిల్లీలో సరకులనుకొనిన ఒకడు తనవద్దవర్తకుడు మితిమీరినలాభమును తీసికొని సరకులనమ్మెనని మొఱపెట్టగా అవర్తకుని అరెస్టుచేసినారు.

## పంజాబులో రాజకీయ ఖైదీల విడుదల

పంజాబురాష్ట్రీయమందు ప్రభుత్వమువారు చాలమంది కాంగ్రెసుఖైదీలను, సెక్యూరిటీఖైదీలను జనవరినెలమధ్యలోగా విడుదలచేయగలరని పంజాబుప్రభుత్వపు కార్యదర్శి ఒకరు డిసంబరు౩౧వ తేదిన పత్రికల ప్రతినిధులకు చెప్పిరి.

### రాయచూరు జిల్లాక్షామబాధితులకు వస్త్రములు

హైదరాబాదు (దక్కను) క్షామబాధోపశమనసమితివారు మంజూరుచేసిన మొత్తము నుండి రాయచూరు జిల్లాలోనిక్షామ బాధితులకై రూ ౫౦౦౦ల విలువగలబట్టలు పంచుమని తెలుపుచున్నది.

## మలేరియా నివారణకై తులసి,పసుపురంగు

సింధురాష్ట్రపు వారెన ఘనశ్యాం ఆద్వానిగారు తులసి,నాజబి, ఘృతకుమారి అనుఓషధుల వాసనకు మలేరియా దోమలు పారిపోవును కాబట్టి, మలేరియావచ్చెడి రోజులలో ఆచెట్లను పెంచియుండుట మంచిదను చున్నారు, తులసిఆకు రసమునుపూసిన శరీరభాగములపైకికూడ మలేరియా దోమలు రావనినారు.

కేంబ్రిడ్జిలోను, ఇంగ్లాండులోను పరీక్షచేసి చూడపసుపు రంగును మలేరియాదోమలు భయపడి పారిపోవునని తేలినదని వారనిరి. అందు మలేరియా వచ్చెడి కాలమందు ఇండ్లగోడలకుపసుపు రంగు పూసియుండుట మంచిదనియు, పడకలకు పసుపు రంగుబట్టలను కప్పుటమంచి దనియువారు సూచించిరి.

దరిద్ర భారతదేశములో ప్రతిఏటు మలేరియా ౧౦కోట్ల మందికివగులును, ఇకవారలలో ౧౫లక్షలమంది మరణించుచుందురు, లక్షలకొలది మంది జీవితములు ధననాశము మొదలైనవాటివల్ల దుర్భరములగును. అట్టిఈ దేశమునకు క్వైనాసరిగా దొరకనిఈ రోజులలో పైరెండుపద్ధతులును ఎంతో అనుకూలములని ఘనశ్యాంఆద్వాని గారు చెప్పిరి.

## సుభాషబోసుగారి తల్లిమరణము

సుభాష్ బోసు గారి తల్లిప్రభావతి బోసుగారు ౨౯వ తేది అర్ధరాత్రికలకత్తానగర మందు స్వగృహమందుమరణించిరి. ఆమెవయస్సు ౭౫ఏండ్లుకొన్నాళ్ళనుండిఆమెకు జబ్బుగానుండినది. ఆమెకుమారుడు కలకత్తా పురపాలక సంఘసభ్యుడగు సతీశ చంద్రబోసు ఇపుడుంగా గావ సంమూడవ రెగు లేషనునను సరించి జెయిలులో నుంచబడియున్న శరచంద్రబోసు, సుభాష్ బోసు గారలేకాక మరినల్గురు కుమారులున్నారు.

## ఈసారి ఇండియాలో ఎక్కువ వరిపంట

భారతదేశమందంతటనుకలిపి వరిపంట ఈసారి ఎక్కువగలదను విషయమున ప్రభుత్వాధికారుల పరిశీలనవల్ల ౫కోట్ల ౫౦లక్షల టన్నులబియ్యము పండవచ్చునని కనపడుచున్నది, యుద్ధమునకు ముందు ఇండియాలో ౨ కోట్ల ౬౦ లక్షలటన్నుల బియ్యము పండుచుండెను. ఇదిగాక బర్మానుండి ౧౫లక్షల టన్నుల బియ్యము దిగుమతి చేయబడియుండెను. ప్రతిరాష్ట్రములోను పంట ఎక్కువగానేపండవచ్చునను చున్నారు. బెంగాలులో వరిసేద్యముచేసిన భూమిక్షేత్రము పూర్వముకంటె నూటికి ౧౬ ఎకరములవంతునను, పంట నూటికి ౨౫టన్నుల వంతునను హెచ్చవచ్చును. దానితరువాత లెక్కించదగినది అస్సాంరాష్ట్రము. ఈరాష్ట్రమందు వరిపంటక్షేత్రము నూటికి ౩ ఎకరాల వంతునను, పంట నూటికి ౧౦టన్నుల వంతునను హెచ్చవచ్చును.

## టి. ఏ. మెనాన్ గారికి క్రొత్త నియామకము రద్దు

ఇదివరలో టి.ఏ.మెనాను అను ఐ.సి.యస్.అధికారిని అరెస్టుచేయుచున్నట్లు డిసంబరు౨౨వ తేదిన 'యునైటెడ్ప్రెస్' వారు ఒకవార్తను వెల్లడిచేసియుండిరి. (ఆవార్త ఈ 'గోలకొండపత్రిక'యొక్క డిసంబరు౨౫వ తేదినాటి సంచికలో కడపుటలో ప్రకటితమయ్యెను.) తర్వాత 'యునైటెడ్ప్రెస్' వారు డిసంబరు౨౯వ తేదిన అరెస్టుజరుగలేదని ఖండనను ప్రకటించినారు.

ఆ టి.ఏ.మెనాను గారిని మిస్కెల సెంగు సఅదనపుజిల్లా మేజిస్ట్రేటుగానియోగించినట్లు ప్రభుత్వమువారు ఇచ్చినఆజ్ఞ ఇపుడు రద్దుచేయబడినట్లు డిసంబరు౩౦వ తేదిన 'యునైటెడ్ప్రెస్' వారు తెల్లడించినారు,

చందా వివరాలు
సం॥రము చందా ౭ హాలీ రూపాయిలు
ఆరు నెలలకు ,, ౩-౧౦-౦ ,,
బ్రిటిషిండియాలో సం॥ చందా ౬ శిల్లారు
విడి ప్రతిక ౦-౧-౨
పాత ప్రతిక వెల ప్రత్యేకము

# గోలకొండ పత్రిక
# Golkonda Patrika

The only Popular Paper that reaches the masses in the Dominions
BEST MEDIUM — FOR — ADVERTISEMENT

Vol. 18 — No 67

*Published on every Monday and Thursday. Hyderabad. Dn.*

6-1-1944


## భారతీయ నౌకాదళానికి క్రొత్తయుద్ధనౌక

కొచ్చినువారు బహూకరించుట

డిసెంబరు ౨౧వ తేదిన భారతదేశము యొక్క ఒక రేవువద్ద భారతీయనౌకాదళమునకు ప్రేలుడు గుండులను సముద్రమునుండి తొలగించుటకును, జలాంతర్గాములను వేటాడినాశము చేయుటకును, ఇతరమైన కాపలాపనులను చేయుటకును నిర్మింపబడిన ఒక క్రొత్త యుద్ధనౌక వాడుకలోకి ప్రవేశపెట్టబడినది. ఈనౌకను కొంతవరకు కొచ్చిన్ ప్రజలిచ్చినధనమునుండియు, మరికొంత కొచ్చిను ప్రభుత్వము వారిచ్చినధనమునుండియు కట్టించిరి. ఘనత వహించిన కొచ్చిను మహారాజుగారి పక్షమున వారి సోదరులైన ఘనతవహించిన రవి వర్మ తంపురాన్ గారు ప్రారంభోత్సవమునుజరుపుచు ఉపన్యసించిరి.

సేట్ వాల్చంద హీరాచందుగారు కృతజ్ఞతను తెలుపుచు భారతీయులయాజమాన్యమున స్థాపితమైన భారతీయనౌకా నిర్మాణప్రదేశ మందు భారతీయాధికారుల పెత్తనములో ఈ నౌక నిర్మించబడినదనియు, విశాఖపట్టణమువద్ద నౌకానిర్మాణ ప్రదేశములో వాణిజ్యానికుపయోగించు పెద్దనౌకలను నిర్మించుకాలమత్వరలో వచ్చినట్లు చేయవలెనని ప్రయత్నించుచుంటిమనియు, దీనికి ఇప్పటికిం డియాప్రభుత్వపు జాతీయము కాని విధానమునిరుత్సాహకరముగ నున్నదనియు చెప్పిరి ఇప్పటికైనను ఇండియాప్రభుత్వమువారు భారతీయనౌకయముల యెడ సంపూర్ణసానుభూతితో తోడ్పడెదరుగాక యని హీరాచందుగారు ఆశించిరి.

—

ఇప్పుడు మ. ఘ. వ. నిజాం ప్రభుత్వపరిపాలనయందు అనేకమైన చిల్లరవిషయములు మంత్రులవద్దకు పోవుచున్నవనియు, వాటిని క్రిందిఅధికారులు పరిష్కరించగలుగుచో పనులు నెరవేరుటయందు ఎంతో ఆలస్యము తొలగుననియు, అంతేగాక మంత్రులపై భారము కూడ తగ్గుననియు, ఇంజను ప్రభుత్వమువారికి అగుచున్న ఖర్చు కూడ తగ్గవచ్చుననియుతలచి నిజాంప్రభుత్వమువారు ఏ ఏ విషయములలో క్రిందిఅధికారులకు పరిష్కారాధికారము నిచ్చుటకు ఏర్పాటుచేసిన ఉపసంఘము చాలా సమాచారమును సేకరించినది. ఉద్యోగులకొందరిని తగ్గించి ప్రభుత్వవ్యయమును తగ్గించుటకు సూచనలు చేయుటకై నియుక్తమైన ఉపసంఘము వారుకూడ ఈవిషయమునుగురించి ఆలోచించుచున్నట్లు తెలియుచున్నదని 'దక్కన్ క్రానికల్' పత్రికలో వార్త పడినది.

* *

భారతీయశాస్త్రపరిషత్తు (ఇండియన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్) అను సంస్థకు ౧౯౪౪ నుండి ౧౯౪౬ వరకు అధ్యక్షులుగ పనిచేయుటకు సర్ సి. వి. రామన్ గారే ఎన్నుకొనబడినారు నలుగురు ఉపాధ్యక్షులు ఎన్నుకొనబడినారు. బి. యస్. మాధవరావు, బి. సుబ్బారావుగారలు కార్యదర్శులుగ ఎన్నుకొనబడినారు * *

హైదరాబాదు(దక్కన్) నగరమందు ప్రారంభమైయుండిన అఖిలభారత శస్త్రచికిత్సకుల మహాసభ సమావేశము డిసెంబరు ౩౦వ తేదిన ముగిసినది. ఈమహాసభ వారు శస్త్రచికిత్సనుగురించి ప్రమాణమైన ఒక గ్రంథమును తయారుచేయించి ప్రకటించుటకును, మదరాసులో కొంతకాలమువరకు శస్త్రచికిత్సనుగురించిన గ్రంథాలయమును నిర్వహించుటకును, రాబోవుసభలో కలకత్తావారగు డాక్టర్ ఛటర్జీ, క్రొత్తఢిల్లీవారగు డాక్టర్ యన్. సి జోషి, కరాచివారగు డాక్టర్ యల్. బి జోషిగారలచే శస్త్రచికిత్సలో వేర్వేరు విషయములనుగురించి ఉపన్యాసములనిప్పించుటకును తీర్మానములుచేసిరి. ఈసారి మహాసభలాహోరులో ౧౯౪౪ ఫిబ్రవరి నెలలో జరుపుటకు నిశ్చయించబడినది ఇందుకై లాహోరువారగు డాక్టర్ కపూర్ గారిని లాహోరుకార్యదర్శిగను, ఆమహాసభకు బొంబాయివారగు ఆర్. యన్. కూపర్ గారిని అధ్యక్షునిగను సభవారెన్నుకొనిరి. మళ్లిమహాసభవరకును బొంబాయివారగు ఆర్. యన్. కూపర్ గారు అధ్యక్షులు, మదరాసువారగు సి. పి. వి. మేనన్ గారు ప్రధానకార్యదర్శి, హైదరాబాదు(దక్కన్) నుండి హైదరలీఖాన్ గారితో కలిసి మొత్తం ౧౧ మంది సభ్యులుగలఒక పరిపాలకవర్గము ఎన్నుకొనబడినది.

మహాసభరోజులలో సభ్యులు హైదరాబాదు సికింద్రాబాదునగరాలలో అనేక వైద్యశాలలకు పోయి చూచుటయేగాక మందు వైద్యమునుగురించియు, శస్త్రవైద్యమునుగురించియు ఉపన్యాసములను కూడ చేసిరి.

* *

సికింద్రాబాదు వై. యం. సి. ఏ లో డిసెంబరు ౩౦ వ తేదిన మదరాసు విశ్వవిద్యాలయమందు రాజకీయశాస్త్రమందురీడర్ అగు డాక్టర్ ఎడ్డీ ఆశీర్వాదం గారు 'భారతదేశానికి ప్రజాస్వామిక ప్రభుత్వము' అను విషయమును గురించి ఉపన్యసించిరి, ప్రజాస్వామిక వ్యవస్థ అన్నది రాజకీయములందే గాక, సాంఘిక విషయములందును, ఆర్థిక సాంప్రదాయిక విషయములందును, ఆధ్యాత్మిక విషయము అందునుకూడ ఉండవలెనని వారుచెప్పిరి ప్రజాస్వామిక వ్యవస్థ నుండి పైకెక్కి నశించి లేవచ్చెడిది సామ్యవాదులు చెప్పినవ్యవస్థయేననిరి ఇండియాలో కులవర్ణ భేదములు మత వాత్సల్యాభిమానములు, ప్రజాస్వామిక వ్యవస్థకు అడ్డంకులైయున్నవనిరి. ప్రతివారును స్వతంత్రమును కోరుచుండుటయు ప్రజాస్వామిక వ్యవస్థకు భంగకరమేననిరి. మరియు చక్కగా చదువుకొని, వివేకముగల జనములేకున్నను ఈ వ్యవస్థ భగ్నమగును. దేశములో దారిద్ర్యము కూడ ఈవ్యవస్థకు విఘాతకారి. సంస్థానాధీశులు రాజ్యాంగబద్ధులు కావలెను

ప్రజాస్వామిక వ్యవస్థలో నాయకులైనవారలకు తెలివి, సామర్థ్యము మాత్రమే కాక గుణములుండి గాడుండుటయు అవసరమనిరి.

.. ... ...

బొంబాయివారగు డి. యఫ్. కరకాగారు వ్రాసిన 'ఐగోవెస్ట్' (I go West) అనుపుస్తకములో కొన్ని ఆక్షేపణీయములైనసంగతులున్నవనుచు నిజాంరాష్ట్రములో దానిని నిషేధించినారు.

సికింద్రాబాదు ప్రదేశములో ఒక్కొక్కరికిని వేర్వేరుగా రేషన్ కార్డునిచ్చుటకు తలపెట్టుటన్లతేమనిండు ఆక్కడ ఇంకొక నెలదాటినతర్వాతగాని ప్రారంభము కాదని తెలియుచున్నది. ముఖ్యములైన ఆహారపదార్థముల ధరలు నిజాం ప్రభుత్వమువారు నిర్ణయించినట్లుగానే సికింద్రాబాదులోనుఉంచబడు నని తెలియుచున్నది.

.. .. ...

ఏలూరునుండి ప్రకటితమగు 'సత్యాగ్రహి' యను దానిసంపాదకుడైన ఆత్మకూరి గోవిందాచారిగారు డిసెంబరు ౩౦వ తేదిన హైదరాబాదు (దక్కన్) నగరానికివచ్చి రెండురోజులుండి జనవరి ౧వ తేదిన గుంటూరుకు పోయినారు

...

అఖిలభారత ముస్లింలీగు మహాసభలో పాల్గొనుటకును, అఖిలభారత సంస్థానాల ముస్లింలీగు మహాసభకు అధ్యక్షత వహించుటకును కరాచీకి పోయియుండిన బహదూరుఖాన్ గారు డిసెంబరు ౧౧ వ తేదిన తిరిగి హైదరాబాదునగరానికి చేరుకొనినారు.




Printed and Published by G. ... at the Golkonda Power Press, Hyderabad-Dn. Editor S. Pratap Reddy, B.A., B.L.